# మనవి

గ్రంథం ప్రచురించటం మా పని,
విలువ కట్టటం మీ పని.

మా కోరికను మన్నించి రచయితలు సహకరించారు. కృతజ్ఞతలు. ఇది మొదటి భాగం మాత్రమే. రెండో భాగం కూడా త్వరలో అందిస్తాం. ముఖ చిత్రం అందించిన శ్రీ జి. కె. సూర్యంగారికి కృతజ్ఞతలు.

సదా మీ సహకారాభిలాషి,
వట్టికోట ఆళ్వారుస్వామి
స్థాపకుడు, ప్రకాశకుడు.

# దేశోద్ధారక గ్రంథమాల

## విజ్ఞప్తి

మహాశయా!

ఆంధ్ర సోదరులకు అవసర గ్రంథముల నందించు ఆశయముతో బహుధాన్య (౧౯౩౮) సంవత్సరంలో కీ॥ శే॥ దేశోద్ధారక, విద్యాదాత, కళాప్రపూర్ణ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారి స్మారక చిహ్నముగా స్థాపింపబడిన ఈ గ్రంథమాల ద్వారా లోగా ౧౨ ప్రచురణములు దేశీయుల కందజేసినాము. ఆ రోజుల్లో విజ్ఞానము నిచ్చి, స్వాభిమానమును పురికొల్పి, సత్వర కర్తవ్యమును తెలుపు గ్రంథములను ప్రచురించి దేశభక్తుల యొక్కయు, మేధావంతుల యొక్కయు మన్ననలను పొందినాము. పిమ్మట మొత్తము భారతదేశంతోపాటు హైద్రాబాదులో యేర్పడిన రాజకీయ అసాధారణ పరిస్థితులలో గ్రంథమాల ౧౯౪౨లో ఆగిపోయినది. ౧౦ సంవత్సరముల తర్వాత కొంత స్థిమితము కలిగి, తిరిగి గ్రంథప్రచురణకు పూనుకొను అవకాశము కలిగింది. గ్రంథమాల స్థాపన కాలములో మా ముందుండిన కర్తవ్యము నేటివరకు తీరలేదని భావిస్తున్నాము.

'మనిషి యే పంథా నవలంబించవలయునో అని ఆలోచించుటకు ముందు వివిధ పంథాలను తెలిసికొనుట ముఖ్యము.' కాబట్టి మేము ప్రచురించు ప్రతి గ్రంథము దేశీయుల ఆకాంక్షలను, హక్కులను, బాధ్యతలను దృష్టియందుంచుకొని కర్తవ్యములను సూచించునదిగా నుండును.

ఇట్టి మా కృషికి చేయూతనిచ్చి మా ఆశయ సఫలతకు దేశీయులు మమ్ము ప్రోత్సహించెదరని విశ్వసిస్తూ, విజ్ఞులగువారి సర్వసహాయాలపై మాత్రమే ఈ వ్యవస్థను నిర్వహించ గలుగుదుమని విన్నవిస్తున్నాము.

పది రూపాయలకు తక్కువగాని విరాళమును మీ నుండి అభ్యర్థిస్తూ, అట్టి మొత్తము మేరకు వెలవడే గ్రంథాలు అందజేయబడునని మనవిచేస్తున్నాము.

3-5-1027 నారాయణగూడ
హైదరాబాదు,

ఇట్లు విన్నవించు
వట్టికోట ఆళ్వారుస్వామి
స్థాపకుడు, ప్రకాశకుడు

## ఈ సంపుటిలో —

# సంఘర్షణ

రచయిత :

శ్రీ. మల్లికార్జున్



జననం : 1932

నివాసం : హైద్రాబాదు

అభిరుచి : సారస్వతం.

రచనలు : గేయాలు, గేయనాటికలు వివిధ పత్రికల్లో ప్రచురింపబడ్డాయి.

అభిమాన రచయితలు : కాళిదాసు, శ్రీశ్రీ, దాశరథి, నారాయణ రెడ్డి.



పాత్రలు :

కవిత్వం

సంగీతం

నృత్యం

శిల్పం

చిత్రలేఖనం

రసం



# సంఘర్షణ

౧

కవిత్వం :

స్వప్నం పంచేవారికి
చేకూర్చెద ఆహ్లాదం -
ఊరటతో మంచు మెరుపు
పండించెద ఆనందం -
మధురగీతికల నల్లుచు
బ్రతుకుబాధల హరింతు -
చిరునవ్వు విలసిల్లగ
నిఖిలలోకముల చరింతు.

సంగీతం :

కంఠం విప్పని కళామతల్లికి
స్వరాలు నేర్పితి నేనే -
పలుకు కరగగా సంగీతరసం
గానం సృజించితి నేనే -
నా మనువెచ్చని రాగాలాపన
చిగురెత్తించును లతాద్రుమంబుల -
నా స్వరమ్ముతో నాట్యములాడే మ
నస్విని పాడును భావగీతముల.

నృత్యం :

నటరాజహస్తములందు
ప్రభవించి ప్రవహించి -
రసిక హృదయములందు
రవళించి రంజించి
అర్ధనారీశ్వరుని

[illegible] -
[illegible]
[illegible].

శిల్పం :

నిన్ను మలచిన బండ
[illegible]యుండ -
చెక్కుడే నాయంద
విజనసౌభాగ్యమునుంద -
మానవత్వమును నా
తో నిల్పుకొన్నాను -
ఎల్లకళలకు పుట్టి
నిల్లునై యున్నాను.

చిత్రలేఖనం :

ప్రకృతిలోని సౌందర్యం
పరుగులెత్తు నాలో -
మధురభావనా వీచిక
మాటలాడు నాతో -
యుగయుగాల వసంతాలు
చిగురించును నాలో -
నందనవన స్మృతి గాథలు
నర్తించును నాలో.

కవిత్వం :

నాటికి నేటికి మేటిని నేనే
కాళిదాసునకు కన్నతల్లినై
పోతన్నకు నే మోక్షదాయినై
కాలము నోడించితి నేనే
కాంచుమ నా [illegible].

చలనరహితమౌ శిల్పం -
హృదయాలను స్పందింపని
పచే చిత్రలేఖనం.

శిల్పం :

శిల్పరహితమౌ కవిత్వం
కల్పనయే కానేరదు -
ఖరస్వరపు సంగీతం
పరువు నిల్పుకోనేరదు -
అందము నివ్వగజాలదు
అడుగుదప్పితే నృత్యం -
శిల్పరహితమౌ చిత్రం
రసం లేని కావ్యం.

చిత్రలేఖనం :

భావమ్మును చిత్రణమే
కవిచేసిన ఘనకార్యం -
స్వరభేదం తెల్పుటయే
సంగీతపు టాదర్శం -
భావమ్మును ప్రదర్శనమె
కావించునుగా నృత్యం -
వీక్షించెను నన్నెగా
విశ్వకర్మ ప్రప్రథమం.

రసం :

గరువమ్ముతో మీరు
కలహింతురేలా
పరువువీడుచు కళా
భాస్వరములారా !

అస్పృతాల పర్షింపు.
ఆనందసీమ.
సంఘజీవుల మీరు
సంఘటితపర్చాలి.
స్వార్థాల తొలగించి
శాంతి చేకూర్చాలి.

కవిత్వం :

నన్ను మీరు నిందింపగ
న్యాయంచేయగునా ?
నామార్గనిరోధకులై
నా కిట్టిది తగునా ?

సంగీతం :

నన్ను మీరు హీనపరచి
నారెందుకు స్వామి ?
నాకంఠం బంధింపగ
నధికారం బేమి ?

నృత్యం :

ఔరా ! ఉన్మాదినినట
అనిసికుండ నౌదునా
అంద రాడిపోయుచుండ
నోరుమూసికొందునా ?

శిల్పం :

అందము నే నందింపర
ఉచ్చబండ కీత్తుప్పదునట
రహస్యాలు చెప్పుటయే
నే జేసెడి వృత్తియట.

చిత్రలేఖనం :

సిగ్గులేనివాపినియట
పిచ్చివాడ నౌదునట
శిల్ప మొకింతయెగాదు
కల్పన నాలో లేదట.

రసం :

ఓహోహో మీరలు వ్యా
మోహములో మునిగినారు
చెడ్డతలంపుల కెరలై
గ్రుడ్డివార లయినారు
మీరు సమ్మతించినచో
మీ లోపమ్ముల జూపుదు
మీరలు శాంతించినచో
మీ సంఘర్షణ నాపుదు.

కా. సం. నృ. శి. చి.

అయినదే కానిండు
అంగీకరించితిమి
పక్షపాతము లేని
పలుకులాసించితిమి.
తప్పులను మన్నించి
మప్పులను కరుణించి
అల్పు లెవరో మాలో
అధికులెవరో చూచి
తీర్పుచేయుము నేడు
న్యాయమును శోధించి.

రసం :

శిల్పంలేని కవిత్వం
సిగ్గులేని స్త్రీ అందం.
కవితలేని సంగీతం
కర్ణ కఠోరం.
గీతసహితనృత్యం
సుడిగాడ్పు సమానం.
కవితలేని శిల్పాలను
కామించదు సౌందర్యం.
శిల్పం లేకున్న చిత్ర
లోకం చిగురింపబోదు.
అన్యసహాయమ్ములేక
ఆడలేరు పాడలేరు.
ఆశించిన ఆనందం
అందివ్వగలేరు
ఆశయాల సంపూర్తికి
అది మార్గం కాదు
స్వార్థం వీడిననాడే
అర్థింతురు మిమ్ము
ఆశను త్రోసిననాడే
ఆశింతురు మిమ్ము
బ్రతుకుబాట పదిలపరచ
భాగస్థులు కండి
భాగ్యహీనతను ఓరే
ఆదరించి రండీ
శాసిస్తుందయ్యో
సమధర్మం యెన్నడైన
గర్వం చిగురింపలేదు
కళాసీమలోన —

ఎందులకీ 'సంఘర్షణ'
ఎందుకు పోరో ఘర్షణ?

క. సం. స్ప్ర. లి. చి.

కోపంలో మునిగి మేము
పాపులమైనామయ్యా
కన్నుల తెరిపించినారు
మన్నింపుము దయామయా
పీడిత జనతాపదాల నెన్నడు
పీడతుంచుటే మా ఇచ్ఛ!
పతితులబాధల బాపే బాటల
అతుకుటలో మా స్వేచ్ఛ!
సమానులం మేమంతా
కళాసీమలో
'సంఘర్షణ' రానివ్వము
బ్రతుకు బాటలో.

రసం :

నిరుపేదల జీవన సాధనలో
నియమించి మీ సామర్థ్యం
చీకటికుటిలో వెలుగు నింపుచు
చేకూర్చేం ఇక ఆనందం
నాందీభరితవాక్యమ్ములగూడే సు
ఖాంతమౌను జీవనరంగం
కళాసీమతీరాల సరసముల
దేలియాడు సంబ్రతరంగం
అదే మీదు సార్థకత
ఆనందపు బ్రతుకుబాట.

# తారుమారు

రచయిత :

శ్రీ ధరణికోట శ్రీనివాసులు



జననం : 1916

నివాసం : నల్లగొండ

అభిరుచి : కథాసాహిత్యం, నాటకాలు, సంగీతం, హాస్య రచనలు.

రచనలు : ముద్రితం : మాయింట్లో (కథానికలు.)
అముద్రితాలు : అనేక కథలు, నాటికలు, రేడియో నాటికలు, ప్రసంగాలు.

అభిమాన రచయితలు : మునిమాణిక్యం నరసింహారావు, కొడవటి గంటి కుటుంబరావు, దాశరథి, సి. నారాయణరెడ్డి, బూర్గుల రంగనాథరావు.

ప్రభుత్వోద్యోగములో ఉన్నారు.



పాత్రలు :

మోహన్‌రావు

రామం

అవధాని

మురళి

పేరంటం

దేవకీదేవి



# తారుమారు

## ఒకటో రంగం

ప్రదేశం:— మోహన్‌రావుగారి యిల్లు

సమయం:— ఉదయం పది గంటలు

[యింటివసారాలో రెండు కుర్చీలు ఓ బల్ల, ఓ ఈజీ కుర్చీలో మోహన్‌రావు కూర్చొని ఆంధ్రపత్రిక చదువుకుంటూ వుంటాడు.]

మోహన్‌రావు:— (చదువు చాలించి) పేరంటం....ఓరే పేరంటం.... పేరంటం (గట్టిగా పిలుస్తాడు)

పేరంటం:— (ప్రవేశిస్తూ) చిత్తం....చిత్తం.. వస్తున్నానండి.

మో: - యెక్కడ చచ్చావురా యింతసేపూ.

పే:— యింట్లోనే చచ్చానండీ.

మో:— ఛా ఛా-వెధవపక్షి.... శుభంగోరు పెళ్లికొడుకా అంటే గొగ్గి పళ్లు చూయించాడట.... శుభంగా పెళ్ళి అయ్యే యింట్లో చచ్చానంటా వేమిరా నీకేం పోయేకాలమో గాని.

పే:— యెక్కడ చచ్చావురా అని మీరే అన్నారండి మొదట.

మో:— (ఆంధ్రపత్రికను బల్లమీద విసిరికొట్టి) చాల్లె వూరుకో. వెధవ పీనుగువి చచ్చినవాడివి యెలాగు వస్తున్నావాయను. యెక్కడో యింటి అవతల చచ్చాననక ఈ యింట్లోనే చచ్చానని చెప్పాలి!

[రామం ప్రవేశం]

రామం:- యేమిటి బావా హడావిడి? ఈ రోజు వాపుతోనే మొదలయింది. యేమిటి కథ?

మో:— ఛా యేమిటా అశుభపు కూతలు రామం? పెళ్లి అనుకున్నది మొదలు చావులు చావులు.... యెప్పుడూ చావులే.... యెలా వచ్చేదుస్తుందో అసలీ పెళ్ళి కార్యం!

రామం:— అదేమిటి బావా! నీవే అశుభపు మాటలు అంటూ పైగా యితరులను అంటున్నావు.

మో:— యేదో పెద్దముండాకొడుకును రామం! ఓ వెధవకూత నా నోటి నుంచి జారిందనుకో దాన్ని పట్టుక యింటిల్లిపాది పాకపలసించేనా! చివరకు ఈ వెధవకూడా దాన్ని రెట్టించాలి? (పేరంటంవైపు గుడ్లురిమి చూస్తాడు) మాదిగ వెధవా.... పోవేం.... ఊ.... యింకా మొహం చూస్తూ నిలబడ్డావేం....ఊ....పో.... (పేరంటం పరుగెత్తుతాడు.)

మో:— సరి యిక వీటికేం గాని, బజారు సామానులన్నీ జాబితాప్రకారం పట్టుకొచ్చేశావా రామం?

రామం:— ఆ.... అన్నీ వచ్చినట్టే.... చీట్ల పేకలు మాత్రం రెండేరెండు దొరికాయి. యింకో అరడజన్ తెప్పించమని దుకాణం నాగయ్యతో చెప్పాను. ఈ సాయంత్రానికి తప్పకుండా తెప్పించి పంపిస్తానన్నాడు.

మో:— ఈ పెళ్ళి గందరగోళంలో చీట్లాడే చచ్చే వెధవలోయి, డబ్బు దండగ పనులు కాకపోతే.

రామం:— అదో మళ్లీ అన్నారూ చావు అని?

మో:— సరి చాలింతువూ మళ్లీ నీ వెందుకంటావు చావని.... పెళ్లి పిల్లవాడి సూటు దర్జీవాడు యింకా పట్టుకు రాలేదు. కూలి మాత్రం నలభయి రూపాయిలు కావాలట. వాడి తలకాయ.... అబ్బబ్బ.... యిదేం కాలమో కాని ఈ అవకతవక ఖర్చులు మా కాలంలో మేము యెరగ్గం బాబూ.

రామం:-- అదిగాడు.... అసలు మనం కట్టించిన సూటు అబ్బాయికి నచ్చుతుందో, లేదో! బొంబాయిలో చదువుకున్నాడు. ఈ వెధవ టౌనులో కుట్టిన బట్టలు యేం మెచ్చుతాడో చూడాలి!

మో:-- యెదో ఒకటి కొత్తది నేర్పితు నాయనా ఆ అబ్బాయికి, నీకు పుణ్యం వుంటుంది.

రామం:-- యిదుగో బావా! ఓ మాట చెప్తున్నా. ఖర్చు పెట్టాల్సిన సమయం వస్తే పెట్టాల్సిందే. డబ్బు డబ్బు - ఖర్చు ఖర్చు అని అఘోరిస్తున్నావే, వెధవడబ్బు నీవేనయ్యా ఖర్చు పెడ్తున్నది.... సరికాని బావా!.... ఈ పెళ్ళి అయ్యేవరకు ఖర్చులను గురించి గాని యేమాత్రమైన నీవు గొణిగావా, మనం మ్యానేజుమెంటు నుండి వెంటనే తప్పకుండా తప్పుకుంటాము.

మో:-- సరె రామం నీయిష్టం. ఏమైనా చేసుకో, నేను మాట్లాడానంటే నిన్ను చంపుక తిన్నటే. యిది నీ అక్కగారి సంసారం. చక్కె పెట్టుకుంటావో పాడే చేసుకుంటావో....నాలుగు రోజుల్లో చచ్చే వాణికి నాకెందుకొచ్చిన కంఠశోష చెప్పు?

రామం:-- అదో మళ్ళీ చావు....

మో:-- చాల్లే. మళ్ళీ నీవెందుకంటావు....సరికాని ఆ తెచ్చిన వస్తువు లేమో చెప్పు చూద్దాము.

రామం:-- (*కాయితం జేబులోంచి తీసి చదువుతాడు*) మూడు డజనాల వాషింగు సబ్బులు, రెండు డజన్ల టాయిలెట్టు సబ్బులు, 15 టిన్నుల నావికెట్లు, 3 గ్రోసుల కత్తెరమార్కు శిగరెట్టు పెట్టెలు, రెండు గ్రోసుల అగ్గిపెట్టెలు, 10 కాఫీ డబ్బాలు. అందులో 5 పాల్సన్సు, 5 బ్రూకు బాండ్లు, 6 కోకో డబ్బాలు, 8 ఓవల్టీనులు, 3 స్నో సీసాలు....

మో:-- యేమిటి రామం....ఈ వెధవసామానులన్నీ. ఈ చుట్ట పీకలకే యిన్ని రూపాయలయితే యెలాగ చచ్చి యేడ్వాలి!

రామం:— అదో మళ్ళీ చావు....

మో:— చాల్లే. మళ్ళీ అని చావకు....ఊ. కానీ. యింకా యేం తెచ్చావు!

రామం:— అయిదు డబ్బాల పొగాకు చుట్టలు.

మో:— వాటి పాడెకట్టను....వెధవ చుట్టలు, వచ్చే వెధవలంతా చుట్టలు తాగే చచ్చే అట్టుంది.

రామం:— మళ్ళీ చావే!

మో:— అదో మళ్ళీ యెందుకంటావు ... ఊ. యింకా యేమిటి ఆ వెధవ పట్టిలు చదువు.

[పేరంటం వస్తాడు.]

పేర:— బాబుగారు....బ్యాండోళ్లొచ్చారండీ.

మో:— బయటనే కాచమను. (పేరంటం వెళ్తాడు.)

రామం:— మళ్ళీ చావే....

మో:— చాల్లెవోయ్....మళ్ళీ అని చావకు.

[అవధాని ప్రవేశం]

అవ:— మహదైశ్వర్యాభివృద్ధిరస్తు. రాజద్వారే రాజముఖే సర్వదా విజి జయమస్తూ.... ....

మో:— రండి అవధాన్లగారూ రండి....కూర్చోండి....విన్నారా యిప్పటి పెళ్ళిళ్ళ వేషం. చుట్టముక్కలకు కాఫీడబ్బాలకే కొంప మున్గు అవుతుంది. ఆడపిల్ల పెళ్ళికంటె అశ్వమేధయాగాలు చెయ్యడం సులభం అనిపించింవండీ నాకు. యేదో యింత పప్పన్నం పడేస్తే జనం తింటారు, పోతారు.

అవ:— (పెద్దగా నవ్వుతాడు) అందుకే పెళ్ళిచేసి చూడమన్నారండి పెద్దలు. అయితే మోహనరావుగారూ! మీవొంటి అగర్భ శ్రీమంతులే యిలాగంటుంటే యెలాగా అని. యేదో, కాలాన్ని పాత్రాన్ని అవశ్యంగా మనం అనుసరించాలి. లేకుంటే అపహాస్యం.

మో:— అంతే అంతే అవధాన్లగారూ! అంతే. అక్షరాల అంతే.

[పేరంటం వస్తాడు]

పేరం:— బాబుగారూ. పెళ్ళికొడుకట. వచ్చారండి మీతో మాట్లాడాల్సిన పనుందట.

మో:— ఆ. యేమిటిరా. పెళ్ళికొడుకేమిటి, రావడమేమిటిరా! అంటావో పెళ్ళికాకముందే రావడమేమిటి! యేమిటో చిత్రంగా వుంది. నాకేమి తోచడం లేదండి అవధాన్లగారూ! ఒరే పేరంటం - నిజంగా పెళ్ళికొడుకేనా లేక యింకెవరినయినా చూచి అంటున్నావా! తెలివితక్కువ వెధవా!

పేరం:— లేదు బాబయ్యా! నిజంగా పెళ్ళికొడుకేనట. ఆయనే చెప్పాడు.

అవ:— పెళ్ళికొడుకే కావచ్చు. వాడు అబద్ధం యెందుకు చెప్పుతాడు....? అయినా మోహనరావుగారూ! పెళ్ళికాందే అల్లుడు యింట్లోకి రాగూడదుగదండీ.

మో:— అదే నేను ఆలోచిస్తున్నాను. (క్షణం ఆలోచించి) అవధాన్లగారూ యిక నాకు చావే వచ్చిందండీ!

రామం:— అదో మళ్ళీ చావని సాయించారూ!

మో:— చాల్లేవోయ్ వూరుకో.

అవ:— ఆ....దానికేం లెండి. యిప్పటి తరహా యింతే. మనం వద్దంటే మాత్రం అగుతుందా....పాడుకాలం కాకపోతే యేమిటీమరి?

మో:— యిప్పుడేం కర్తవ్యం అవధాన్లగారూ ! యింట్లోకి వివాహానికి పూర్వం రాగూడదంటే ఆయనగారికేం కోపంవస్తుందో.... నేను యేలాగు చచ్చేదండీ అవధాన్లగారూ !

రామం:— మళ్ళీ చావు - చావు....(వెళ్ళి పోబోతాడు)

మో:— చాల్లే రామం.... నీవు వెళ్ళబోకు.... మళ్ళీ మళ్ళీ అని చావకు. యిది పరిహాసాలకు సమయం కాదు. నానెత్తిన పిడుగు పడి పోయింది రామం. బుద్ధి పనిచెయ్యడం లేదు.... అవధాన్లగారూ ! ....రామం....నాకేదైనా ఆలోచన చెప్పండర్రా మీకు పుణ్యం వుంటుంది.

రామం:— ఆలోచనకల్లా యేముందండీ. అల్లుడు వచ్చి యింటిముందు నిలుచున్నాడాయెను. యిప్పుడు మనం కూర్చున్న వసారాలోకి వస్తేమాత్రం తప్పేముంది బావా !.... యేమంటారు ? అవధాన్లగారూ !

అవ:— (నిట్టూర్పువిడిచి) యెంతమాత్రం పనికిరాదులెండి. మనం సాంప్రదాయాలు చూసుకుందామా లేక మొహమాటాలు చూసుకుందామా ? మోహన్‌గారూ ! జ్ఞాపకం వుంచుకోండి. యిది కలియుగం. సాంప్రదాయాలకు విరుద్ధంగా మనం యేమి చేసినా లోకులు కాకుల్లాగ విరుచుకపడ్తారు. కాస్త ఆలోచించి మరీ చెయ్యండి.

మో:— అయితే అవధాన్లగారూ ! నేనువెళ్ళి బయట ద్వారంవద్ద ఆయనతో మాట్లాడుతాను. లోపలికి రావడం బాగుండదని నచ్చ చెప్తాను. అయినా యిప్పుడు ఆయనకున్న పనేముంది మన యింట్లో.... యేమిటో. యేమీ తోచడంలేదు. అయితే అవధాన్లగారూ ! మీ రిద్దరూ యిచటనే వుండండి. నేను ఆయనతో మాట్లాడి వస్తాను.

రామం:— కాని బావా కాస్త జాగ్రత్త. మాటల ధోరణిలో మళ్ళీ చావులు బ్రతుకులు అని ఆయన్ని నొప్పించేశేవు.

మో:—చాల్లేవోయి.... మళ్లీ అవేషప మాటయా నీపూను.

[తెర]

## రెండో రంగం

ప్రదేశం:—యింటిముందు

[వేపచెట్టునీడలో మురళి పచారు చేస్తుంటాడు. నోట్లో సిగరెట్టు పొగ గుప్పు గుప్పు మని వదుల్తుంటాడు]

మో:—(ప్రవేశిస్తాడు)

మురళి:—నమస్కారమండి (సిగరెట్టు మాటంగాపారేసి మర్యాదగా నిలబడి వుంటాడు.)

మో:—యేం నాయనా యేదోపనిమీద వచ్చినట్టున్నావే.... అయ్యో నిలబడే వున్నావే. నా తెలివి తెల్లవారినట్టేవుంది.... అరే వేరంటం. ఓరే వేరంటం— యెక్కడ చచ్చావురా.... రెండు కుర్చీలు పట్టుకురారా.

మురళి:—అక్కర్లేదులెండి— యింట్లోకే పదండి.

మో:—ఆ.... యింట్లో కెందుకు నాయనా. కాదుకాదు. మీరు యేమీ అనుకోకండి నేను యిలాగంటున్నానని....యేదో రేపు రాత్రికి ముహూర్తం అనుకున్నాం కదా అంతకు పూర్వం యింట్లోకి రావడం బావుండదేమోనని. అంతే. నలుగురు నాలుగు విధాల అనుకుంటారు నాయనా. నలుగురినోరికెందుకు? అసలు మీనాయన గారు పూరుకుంటారా చెప్పండి. యేదో మీది కుర్రతనం కాబట్టి ఈ కష్టసుఖాలు తెలియవు మీకు.

మురళి:—ఈ సాంప్రదాయాల మాటలకేం లెండి. అసలు నేను వచ్చింది మీకూతుర్ని చూడడానికి. నాకు తెలియకుండానే ముహూర్తం నిశ్చయం చేసుకొని నన్ను బొంబాయినుండి పిలిపించారు. కాని నేను అమ్మాయిని చూడలేదు. ఆవిడను చూడందే పెళ్ళి యెలాగు చేసుకొనేది చెప్పండి.

మో:—మీవాళ్లంతా అమ్మాయిని చూశారు. అమ్మాయికేం బంగారు తునక. యేమీ వంకలేదు.

మురళి:—అయినా నేను అమ్మాయిని చూడందే పెళ్లి చేసుకోనండీ. పెళ్లి నాది- యింకెవరిదీ కాదు.

మో:—అంతపట్టుపట్టితే యేలాగునాయనా? పెద్దవాణ్ణి నామాట విను. మీ నాయన ఒకటి నేను ఒకటీనా. రేపీపాటికి అంతా అయిపో తుంది. ఒక్కరోజు కొరకు యెందుకీ పాడుప్రపంచంలో అను పించుకోవడం.

మురళి:—పోనిద్దురూ వెధవ ప్రపంచంతో నాకేంపని? నేను మాత్రం అమ్మాయిని చూడకోకుండా పెళ్లి చేసుకోను. యేమైనా సరే తర్వాత తమ యిష్టం.

మో:—తొందరపడకు నాయనా కాస్త ఆలోచించు.

మురళి:—నేను యెక్కువ మాట్లాడదలచలేదండీ. అమ్మాయిని చూయిం చడం యిష్టంలేకుంటే మీరు యింకో సంబంధం చూడకోవచ్చు. *(వెళ్ళిపోబోతాడు)*

రామం:—*(ప్రవేశిస్తాడు)* ఆగండి. ఆగండి. అంత తొందరపడుతున్నారేం? మా బావగారు పాతకాలపు మనిషి. యేదో అన్నారు. దానికేం లెండి..... రండి అమ్మాయిని చూద్దురుగాని *(మురళి చెయ్యిపట్టు కొని లోపలికి తీసుకువెళ్ళుతాడు)*

మో:—నాకు చావైనా వచ్చిందిగాదురా దేవుడా! *(నెత్తిబాదుకుంటాడు)*

*[తెర]*

మూడో రంగం

ప్రదేశం:—యింటివసారా

*[అవధాని, మోహన్‌రావు, రామం, మురళి కుర్చీల్లో కూర్చొనియుంటారు]*

అవధాని:—అమ్మాయిని చూడక తప్పదంటారా

మురళి:—అవునండీ చూడక తప్పదు.

మో:—యివ్వాళ్ళ తిథి నక్షత్రాలు యెలాగున్నాయో! యేం అవధాన్లగారూ.

అవ:—తిథి వార నక్షత్రాల కేంలెండి. (పంచాగం విప్పి చూస్తాడు) బాగానేవుందే.

మురళి:—పోనిద్దురూ. యింకా బూజుపట్టిన భావాలు. పూర్వం మాత్రం అమ్మాయిని చూడకుండా పెండ్లి చేసుకున్నారటండీ. స్వయం వరాలంటే వినలేదూ!

అవధాని:—సరే.... మోహన్‌రావుగారూ కానివ్వండి యేంచేస్తాం. శుభస్య శీఘ్రం.

మో:—రామం, అమ్మాయిని తీసుక రా.

(రామం లోపలికి వెళ్ళి దేవకీదేవితో మళ్ళీ వస్తాడు)

మో:—అమ్మాయి రా రా.... కూర్చో.... పరాయివాళ్లెవరూలేరు రావమ్మా.

దేవకి:—(కూర్చుంటుంది ఓ కుర్చీలో)

మురళి:—అమ్మాయి పేరు?

రామం:—దేవకీదేవి.

మురళి:—అద్భో రాచబిడ్డ పేరు.... చాలా బావుంది. (అమ్మాయిని బాగా పరిశీలించి చూస్తాడు) అమ్మాయి. ఇంగ్లీషు చదువుకున్నావా!

దేవకి:—(సిగ్గుపడుతూ అవునన్నట్టుగా తలవూపుతుంది.)

రామం:—ఓ ఆంగ్లో ఇండియన్ లేడీవద్ద చదివించాము.

మురళి:—యేదీ ఈ న్యూస్ పేపర్‌లో యెదైనా చదివి వినిపించు అమ్మాయి. (చేతిలోవున్న ఇంగ్లీషుపేపరు అమ్మాయిచేతి కిస్తాడు)

దేవకి:—(పేపరు చదువుతుంది.)

"The appeal issued by leading workers in the Women's Movement in the state supporting the candidature of woman candidates in the forthcoming elections would be echoed by people all over the state."

మురళి:—బాగు బాగు.... ఎక్సెలెంట్.... వండర్‌ఫుల్, నైస్. మంచి ఉచ్చారణ. ఆంగ్లో యిండియన్ లేడీ వద్దగనూ చదివించారా! అసలు అదీ రహస్యం. యే యితరులో చెపితే అంతగా బాగుండక పోవును ఉచ్చారణ.... సరి. కాని అమ్మాయీ! నీకు సంగీతం వచ్చా.

రామం:—అవునండీ. ఈ వూళ్ళోవున్న ఆధునిక నవ సంగీత విద్యాలయంలో సంగీతం చెప్పించాము.

మురళి:—ఓ పాట పాడు అమ్మాయి వింటాను.

మో:—ఆ. పాట యెలా పాడుతుందండీ!

మురళి:—యేం అమ్మాయి సిగ్గుపడుతుందా యేమిటి? విద్యను ప్రదర్శించ డానికి సిగ్గెందుకూ?

రామం:—పాడమ్మాయి పాడు.... సిగ్గెందుకు?

దేవకి:—(పాట పాడుతుంది)

పాట.

శ్రీరామా సీతారామ - కాపాడ రావ
భక్తలోకపాల రామా - జాలమేల రావా
కాపాడ రావా. శ్రీరామా॥

మురళి:—ఎక్సెలెంటు. మార్వలెస్.... నాకు అమ్మాయి నచ్చిందండీ. యింకా వస్తానండీ (లేస్తాడు)

[రామం, మోహన్‌రావు మురళిని సాగనంపడానికి అతని వెనక నడుస్తుంటారు]

దేవకి:—(పర్చిలోంచిలేచి) నాన్నగారూ ఆగండి. వారు మాత్రం నాకు నచ్చలేదు. వివాహానికి పూర్వం కన్యలను పరీక్షించే అధికారం మొగాళ్ళకుంటే ఆడపిల్లలకు గూడా మొగాళ్ళను పరీక్షించే అధికారం వుండాలి.... వారిని పెళ్లిచేసుకోవడం నా కెంతమాత్రం యిష్టంలేదు.

మో:—ఆ పూరుకో అమ్మాయి. తప్పు. అలా నీవు అనకూడదమ్మా.

మురళి:—(అమ్మాయివద్దికివచ్చి) ఆడేమిటమ్మాయి- నన్ను పరీక్షించడందే ఫేలు చేశావే!

దేవకి:—(తండ్రితో) వారిని పరీక్షించడం నా కనవసరం. వారికి నాపూ ఆకారానికి ఘూమిక పున్న తేడావుంది. నేను భారత స్త్రీని....

మురళి:—నేనూ భారతీయుణ్ణేగదూ!

దేవకి:—(తండ్రితో).... కాని వారు విదేశీయ సంస్కృతిగలవారు. నేను వివాహాన్ని ఆత్మబాంధవ్యంగా యెంచుకుంటాను. వారు కేవలం శరీరబాంధవ్యంగా యెంచుకుంటారు.

మురళి:—ఓహో ఆలానా - బాగా కనిపెట్టావే!

దేవకి:—వారికి నచ్చిన నా సౌందర్యం, శ్రావ్యమైన నా గొంతు యే వ్యాధి పీడితనయ్యో చెడిపోయిన వారి కళ్లు నన్ను చూడనొల్లవు. వారికి బోలెడు విజ్ఞానం వుండొచ్చు. కాని రవంత మానవత్వం వున్నట్టు నా కగపడడంలేదు.

మురళి:—థ్యాంక్యు ప్లీస్.... ఇప్పట్టి చేస్తున్నావు జాగ్రత్త.

దేవకి:—సంత విక్రయ పశువును చూచినట్టు వారు చూస్తున్నారు నాన్నారూ! వీరు సౌందర్యం ఒంపులూ, రూపు రేఖలు ఆరాధించే వారనే విషయం మీరు మరువకండి...

మురళి:—యస్. ఎక్సాక్ట్లీ (Yes, exactly)

దేవకి:—నన్ను పశుప్రాయంగా ఈ సౌందర్యోపాసకులకు బలి యివ్వకండి. వివాహాన్ని ఆత్మ బాంధవ్యంగా యెంచుకునే యువకుడే నాకు కావాలి.,... నాన్నగారూ! వారితో చెప్పేసెయ్యండి. నాకు వారు బొత్తిగా నచ్చలేదు. వారిని నేను వివాహం చేసుకోను. యిది నా ధృఢనిశ్చయం.

మో:—దేవకీ.... నా ముద్దుబిడ్డా. నీయిష్టమే లేనితర్వాత అంతా ఒట్టిదే నమ్మా (మురళివైపు చూస్తూ) వింటున్నావు కదా నాయనా, అమ్మా యికి నీవు నచ్చలేదట... నాకు చాలా విచారంగావుంది. యింకెక్క డైనా నీయిష్టంవచ్చిన అమ్మాయిని వివాహం చేసుకో. మీ నాయన గారికి ఈవార్త అందచేస్తాను.

మురళి:—(కోపంగా మోహన్‌రావును అమ్మాయిని చూస్తాడు) బ్రూట్స్, స్కౌండ్రల్స్ (అంటూ వెళ్ళిపోతాడు)

రామం:—యేమిటి యిదంతా అమ్మాయి. యిక యీ పెళ్లి యెత్తిపోవల సిందేనా? ప్రపంచం యేమంటుంది.

మో:—పాడు ప్రపంచం యేమన్నాసరి రామం. నీవు మాత్రం అమ్మాయిని యేమన్నా ఒప్పుకోను. ఆత్మగౌరవంగల ఓ భారత స్త్రీ చెయ్య వలసిన పని చేసింది అమ్మాయి. యిలాంటి కన్యలను శ్లాఘించక పోవడం మనకెంతైనా సిగ్గు. యిక వివాహం గురించా నా కెంత మాత్రం విచారంలేదు. నా ముద్దు బిడ్డకు యెవరైనా దొరుకుతారు. (అమ్మాయి తల నిమురుతూ ముద్దెంటు కుంటాడు) రామం, అమ్మా యిని యింటోకి తీసుకెళ్లు.

రామం:—(అమ్మాయితో లోపలికి వస్తూ) My god. కథంతా అడ్డం తిరిగిందే! (లోపలికి వెళ్ళిపోతాడు)

మో:—అవధాన్లగారూ! చూశారా! అంతా తారుమారు. కాలవిపరియాసం. మనచేతిలో యేమీలేదు. యేది యెటయినా మళ్ళీ యింకో సంబంధం చూడలేక నాకు చావొచ్చింది.

అవధాని:—తథాస్తు. శీఘ్రంగా రావలసిందే

మో:—(నోరు తెరచి)ఆ...ఆ... అలాగంటారేమండీ!

అవధాని:—అబ్బే.... కల్యాణం అనుకున్నాను.

*[యిద్దరు విరగబడి నవ్వుతారు.]*

(తెర)



# పగ!

రచయిత :

శ్రీ పొట్లపల్లి రామారావు

జననం : 1920

నివాసం : తాటికాయల, తా॥ వరంగల్

అభిరుచి : సారస్వతం.

రచనలు : ముద్రితం : 'జేలు' (కథానికలు) కథానికలు, గేయాలు, నాటికలు పత్రికల్లో ప్రచురింపబడ్డాయి.

అభిమానరచయితలు : గోర్కీ, పెర్ల్‌బక్, విలియం సారాయన్, రోమారోలాండ్, టాల్‌స్టాయ్, పోతన, రాయప్రోలు సుబ్బారావు, చలం, ప్రేంచంద్, కిషన్‌చందర్.



పాత్రలు :

పుల్లయ్య
నర్సయ్య
ఒకటవ పోలీసు
రెండవ పోలీసు
నరసింహారెడ్డి
అమీన్
ఎలవాడు

# పగ!

## ఒకటో రంగం

### రైతు ఇల్లు

పుల్లయ్య:- మొన్న సింగారం అమీనువస్తే సోలెడు బియ్యం కావాల్నంటె, యిచ్చినోడు లేడట. కోమట్లు మాదగ్గర లేవంటె, మాదగ్గర లేవని, జవాన్లు పిలిచినా, చేయిపట్టి యీడ్చినా, ఎవడూ కదల లేపట.

నర్సయ్య:- బియ్యం పోసీయి....మళ్లి ఆ ఊళ్లోనుంచి పోదామంటే బండి దొరకలేదు....ఎవడు యిస్తడు?

పుల్లయ్య:- ఎట్లాపోయిండు మరి?

నర్సయ్య:- కాళ్ళు నెత్తిన పెట్టుకొని....ఏమిచేస్తడు? ఊళ్ళో నిలపటపితె పరుపు దక్కేటట్టు లేదాయె. ఊరును యేమిచేస్తనో చూడు అని మండుకుంటు పోయిండట.

పుల్లయ్య:- మూట....మళ్లె....మరి?

నర్సయ్య:- అది వినరాదు!....సాకలోళ్ళు అంతా యిండ్లల్లో లేమని తప్పించుకున్నరట, రూపాయి, రూపాయి, యిస్తమంటే, అదైనా ఎంతో బ్రతిమిలాడితె, యిద్దరు కూలోళ్లు వచ్చింద్రట. వాళ్ళైనా రూపాయీలు చేతులపెడితినె, వస్తమన్నరట. దేవుడా! అను కుంటూ పచేలు ఎక్కణ్ణో తెచ్చి యిచ్చిండట అప్పుడు.

పుల్లయ్య:- కూలోళ్ళు మాగదొరికింద్రు. వాళ్ళకు ఏమిపుట్టింది దుర్బుద్ధి?

నర్సయ్య:- మన పెద్దలు లేరు? అమీనుకు యెక్కడ మనసు విరుగు తదో! యెక్కడ నొప్పి అయితదో! యేమి కోపమొస్తదో! అని యెంతభయం యెంతబాధ వాళ్ళకు?

పుల్లయ్య:- ఈ ఊరి పెద్దలందరిని నీళ్ళులేని దగ్గర....

నర్సయ్య:- వీళ్ళబలము చూసుకొనెనాయె, మనని వాళ్ళు పీక్కతినేది! లేకుంటే మనమీద చేయివేయడానికి ఎన్నిగుండె లుండాలె వీళ్ళకు?

పుల్లయ్య:- వాళ్లకు ఇంత యెంగిలి దొరికితె సరి....

నర్సయ్య:- జాగీరులో యీ పెద్దలంవరు కలిసె పట్టి యిచ్చింంద్రట.... నారాయణపంతులును.

పుల్లయ్య:- మనవాళ్ళె మనయింటి మర్మం చెపుతుంద్రు. యింటిదొంగ ప్రాణగండం....

నర్సయ్య:- నరసింహారెడ్డి వెంబడి పడ్డరు వీళ్లిప్పుడు. ఆయనను ఎట్లయినా పట్టి యివ్వాలెనని యెన్నో ఆలోచనలు, యెన్నో వేషాలు, యెన్నో పన్నాగాలు పన్నుతాంంద్రు.

పుల్లయ్య:- ఆయనగాని వీళ్ళకు దొరకడు. ఎవనికడుపుల యేమున్నదో? ఎక్కడే టొందవున్నదో? ఆయన చూపుతోనె గ్రహించుకుంటడు.

నర్సయ్య:- మన లోపలనుంచె యెవరైన పోయి చెపితె అయిపోయె.... అచెంతఘనం? తెలియనంతవరకే ఏదైన....

పుల్లయ్య:- నిజమే....కాని, ఆయన జాగ్రత్తలో ఆయన లేడంటవా?

నర్సయ్య:- ఏదివం ఎట్లవచ్చునో? చెప్పివస్తయ్యా?

పుల్లయ్య:- అంతే....కాని, మొన్న బాగచేసిండట.

నర్సయ్య:- బాగనా!....మరి బాగనా.

పుల్లయ్య:- నిద్రలో వున్నా....మావోడు వచ్చి చెప్పిండు నాకు....సరిగ్గా వినలేదు నేను.

నర్సయ్య:- ధర్మారంలో గవళోళ్ల దుకాణాల మీద పడి, వాళ్ళు తన్నుత, గుద్దుత, అని బెదెరించి గొంతుకదాక తాగి చావట్లో పన్నడట

పోలీసోడు. నరసింహారెడ్డి చూడు చూడు మని ఆలోజె వచ్చిం డట. గవళోళ్లపోయి, యిదేమి అన్యాయమయ్యా, యిట్లయితె మేము మా యిండ్లల్లనె ఉండలేము, అని ఆయనతోని మొర పెట్టుకున్నరట. నరసింహారెడ్డి ఆ అర్ధరాత్రి పోయి పండుకున్న వాణ్ణి చక్కగా కూర్చొబెట్టి వాళ్ళకు పైసలు యిస్తవా? లేదా? అని గట్టిగా అన్నడట. తెల్లముఖంపేసి, గడగడ వణుకుకుంటు అప్పటికప్పుడు యిచ్చిండట పైసలు.

పుల్లయ్య:- వాళ్ళకు యిప్పుడు చావైంది. కోళ్ళు దొరుకుతలేవు, గొర్లు దొరుకుతలేవు. ఎట్టిలేదు. గొట్టంలేదు. ఊళ్లకువస్తె మందలం బెట్టోడెలేడు. బజార్ల కుక్కగూడా చేస్తలేదు వాళ్ళకు.

నర్సయ్య:- మన అమీన్ నరసింహారెడ్డి మీద మండుతున్నడట. దొరి కితె చంపేద్దామని చూస్తాండట.

పుల్లయ్య:- ఇక ఏమిచేస్తడు మరి? తిన్న ప్రాణాలాయె. ఎక్కడ ఏమి దొరకకుంట అయె....ఊళ్ళమీదపడి యిష్టమున్నట్టు దోచుకొని తిని బ్రతికినోళ్ళకు యిప్పుడు నోళ్లు కట్టినట్టు అయింది. జీతం రాళ్ళు ఎక్కడికయితయి....యిక మండడుమరి?

నర్సయ్య:- కనపడితె నిలువున మింగుదామని ఉంటొచ్చు వారికి.

పుల్లయ్య:- దొరికితెనా?

నర్సయ్య:- అబ్బో! దొరికితె ఇంకెక్కడిది? మళ్ళీ మనుసులముఖం చూడనిస్తాడు? అంతమంట వున్నది వానికి.

పుల్లయ్య:- నరసింహారెడ్డికి మంచి పేరొచ్చింది. ఎవడు ఆయనను తలచుకోవడమె ...ఎవడు ఆయన సంగతి చెప్పడమె....ఎక్కడ విన్నా ఆయనగూర్చి వినడమె....

నర్సయ్య:- మన తాలూకా అంత ఆయనను తలవని ఊరులేదు.

పుల్లయ్య:- తాలూకా ఏంది ? దేశం అంత అనుకుంటున్నరు ఆయన పేరు. కోళ్ల పాయె. గొర్లు పాయె. దండగయి పాయె. దోషాయి పాయె. ఊరోళ్ళమీద వేయిపెట్టి చూపినోడె లేడాయె యిప్పుడు ? యిక ఎందుకు అనుకోరు ?

నర్సయ్య:- నరసింహారెడ్డి........

(యిద్దరు నైజాం పోలీసులు ప్రవేశిస్తారు.)

ఒ. పో:- నరసింహారెడ్డి ఎవడు ? వాని ముచ్చట పెట్టుకుంటున్నరు ?

నర్సయ్య:- మా తమ్ముడు.

ఒ. పో:- మీ తమ్ముడా ? మీ తమ్ముని సంగతేనా ? మీ తమ్ముడు ఏడి ఎక్కడ ఉన్నడు ?

నర్సయ్య:- బళ్లారాడ ఉన్నడు.

రెం. పో:- నిజంచెప్పు....నరసింహారెడ్డి ఎక్కడ ఉన్నడు ?

నర్సయ్య:- యిప్పుడు చెప్పేది అబద్ధమా ? మా తమ్ముడు ఎందుకు ?

ఒ. పో:- వాడు బాగ నేర్పింపు మీకు. అయితె మీ ఊళ్లోనే ఉన్నడు నరసింహారెడ్డి ?

పుల్లయ్య:- మాకు తెలియదు.

రెం. పో:- మీ యిళ్ళకు పద.

నర్సయ్య:- మే మెందుకు ?

ఒ. పో:- నడవు. పని ఉన్నది మీతోని.

నర్సయ్య:- మాకు తెలియదు.

రెం. పో:- యిళ్ళల్లో దాచిపెట్టుతారు ? దొరకనీయి. మీరూ పోతారు వానితోని.

నర్సయ్య:- దొరికితే తీసుకపో.

ఒ. పో:- నీవు నడవాలె,

నర్సయ్య:- మాకు పనులున్నాయి. (పోబోతాడు)

రెం. పో:- ఏయ్ ! నిలవబడు,

నర్సయ్య:- ఎందుకు ?

రెం. పో:- నిలబడు.

నర్సయ్య:- ఏంది చెప్పు.

(నర్సయ్య నిలబడతాడు. ఒకటో పోలీసు అతనిచేయి పట్టుకుంటాడు. పుల్లయ్య జారుకుంటాడు.)

ఒ. పో:- నాతోని కచేరికి నడువు !

నర్సయ్య:- ఎందుకయ్యా ?

ఒ. పో:- నీవు నడస్తవా లేదా ?

నర్సయ్య:- ఏమి దొంగతనం చేసినా ?

ఒ. పో:- అక్కడికి పోయినంక తెలుస్తది పా.

నర్సయ్య:- ఏందో ఆనేరము : యిక్కడ చెప్పరాదు !

రెం. పో:- మీకు బాగా బుద్ధిసెపుతా....చూస్తుండు.

నర్సయ్య:- యిక నీతోనె నేర్చుకోవాలె బుద్ధి.

ఒ. పో:- నోరు జారనియ్యకు.

నర్సయ్య:- ఏందిమరి ? నడిఊళ్ళో దొంగను పట్టుకున్నట్టు పట్టుకొని, 'కచేరికి నడవు'....'కచేరికి నడవు'....ఏమి తప్పుచేసినా ?

(యింతలో గొంగడి కొప్పెర వేసుకున్న నరసింహారెడ్డి లావాటి కర్రతో మెల్లగా వస్తాడు.)

నరసింహా:- ఏమితప్పు చేసిండు వీడు ?

రెం. పో:- ఎవరు నీవు ?

నరసింహా:- ఏమితప్పు చేసిండంటుఉంటె ?

ఒ. పో:- నీపేరు ?

నరసింహా:- నాపేరు చెపుతాకాని వీడి తప్పేమిటో చెప్పు మొదట !

రెం. పో:- నీకేమి అక్కర ? నీవెవడవు ?

నర్సయ్య:- అమీన్ కచేరికి తీసుక పోతాడట,

నరసింహా:- నీవు చాలపూ....దొరవు !

ఒ. పో:- నీవు నరసింహారెడ్డివా.... ? నీవేనా ?

నరసింహా:- నేను యిదిగో వీడిని-

(కర్రతీసి గట్టిగా వీపుమీద దెబ్బ కొడతాడు)

రెం. పో:- అరేయ్....చంపాడు.

నరసింహా:- వాడిని విడువు నీవు.

(విడుస్తాడు)

నరసింహా:- యిక మీ అమీన్ దగ్గరకు పోయి నాపేరు చెప్పు.

ఒ. పో:- నీకు యింతబలం వచ్చిందీ ?

నరసింహా:- కోళ్లు, గొర్రెలు తిని,

ఒ. పో:- చూస్తావు ఉండు !

నరసింహా:- వచ్చినవాడివి దారివెంబడిపోక దారిని పోయేవాళ్ళను ఏడ్పిస్తావు ?

రెం. పో:- మంచిది.

నరసింహా:- మాట్లాడక వెళ్ళు.

(యిద్దరూ భయపడుతూ తిరిగి, తిరిగి, చూస్తూ పోతారు.)

నర్సయ్య :- మీరు రాకపోతె ?

నరసింహా:- పట్టుకపోయి నాలుగో అయిదో కాజేస్తును.

నర్సయ్య:- మీ ముచ్చటే పెట్టుకుంటున్నము. మీ పేరు విని నరసింహా రెడ్డిని జూపుమంటు వచ్చిండు.

నరసింహ:- యికేమి ; చూపాడుకదా ! పోలీసులు...., పోలీసులు అని ఎగ బోసుకుంటు ఉరికి వచ్చిండు నావగ్గరికి పుల్లయ్య. నేను ఏమిటో అనుకున్న !

నర్సయ్య :- మిమ్మల్ని గుర్తుపట్టాడు.

నరసింహ:- పట్టనీయి ఏం భయం ?

నర్సయ్య:- మనం యిక్కడ ఉండవద్దు.

నరసింహ:- యికేమి పని !

*(వాళ్ళిద్దరూ పోతారు. మరికాసేపటికి పారిపోయిన యిద్దరు పోలీసులు భయపడుతూ శెదిరిచూస్తూ ప్రవేసిస్తారు)*

ఒ. పో:- నా బీటుబుక్కు పోయింది.

రెం. పో: నా నడుం బిళ్ళ లేదు.

ఒ. పో:- యిక్కడే పోయింది అది.

రెం. పో:- *(యిద్దరూ క్రిందికివంగి వెతుకుతుంటారు)* తొందరతో మెడమీదినుండి జారింది.... నేను కనిపెట్టలేదు.

ఒ. పో:- గొంగడివాడు నరసింహారెడ్డి.

రెం. పో:- లేకపోతె యింకోనికి యింతబలం ఎక్కడిది ?

ఒ. పో:- వాణ్ణి పట్టుకోకపోతె మనపని ఉత్తదే.

రెం. పో:- ఊళ్ళలో మనం తిరగలేము యిక.

ఒ. పో:- ఉండు ఏమిచేస్తానో చూడు. పట్వారిని రమ్మంటే రాలేదు చూడు.

రెం. పో:- ఎల్లోడు చెప్పిండో లేదో! అయినా యిక్కడికి వద్దు. కచేరికి పిలిపించుకుందాము.

ఒ. పో:- (సంచివెతికి) బీటుబుక్కు యిదిగో.

రెం. పో:- (నడుముకు చూచుకొని) నావిక్కు యిదేంది !

(ఇద్దరూ నిష్క్రమిస్తారు)

## రెండో రంగం

ఊరుచావడి. అర్ధరాత్రి వేళ.

*(లాంతరు ఒకటి వెలుగుతూ ఉంటుంది. అమీన్ మంచంపై కూర్చుని పనికిపాట్లుపడుతు, అప్పుడప్పుడు ఎవరికోసమో ఎదురు చూస్తుంటాడు. మంచంపైన తోటాలునింపిన పిస్తోలు ఉంటుంది.)*

అమీన్:- పిళ్లపోయి చాలసేపైంది....యింకా రాలేదు ? ఏమి కావచ్చు ? పట్వారీ...., 'ఉన్నాడయ్య....తప్పక ఉన్నాడు....దొరకకలప్ప' దని ఒట్లన్ని పేసుకున్నాడు. పట్వారి ఏమైన చేయలేదుకదా! ఎవణ్ణీ నమ్మేటట్టులేదు. కాలం అంతా మారిపోయింది. పైకి 'హుజూరు....హుజూరు ' అని అన్నా లోపల పూర్వపు భయ భక్తులు ఒకటికి లేవు. ఏమిటి వీళ్ళు? నేనుపోతె యింతసేపు పట్టేదా ? పట్వారి స్వంతమనుషుల సిద్ధపరచానని చెప్పినాడు. ఏమి చేసిందో ! నిద్రమొఖం? ఈ కదిలర అంతా వాడు ఏ కన్నంగుండానో కనిపెట్టి ఉడాయించిందేమో ! వీళ్ళ తెలుపులు యింతే.

*(ఇంతలో తెరలో ఉద్వేగంగా మాట్లాడుకుంటున్న మనుషుల చప్పుడు వినబడుతుంది. ఆ చప్పుడు విని అమీన్ పిస్తోలుతీసుకొని లేచి ఆ ధ్వని ఏమిటో కుతూహలంగా వింటూ అటుయిటు తిరుగుతుంటాడు. చప్పుడు మరింత దగ్గరైతుంది. యింతలో నరసింహారెడ్డిని గట్టిగా తాళ్ళుపోసి ఆ ఇద్దరు పోలీసులు పట్టుకొని వస్తారు.)*

అమీన్:- పట్టుకున్నారు ! షాబాస్ ! నాకు నమ్మకెలేకుండె. మీరు పట్టుకుంటారని. చాల గొప్పపని చేసిన్రు. తీసుకరాండి యిటు.

ఒ. పో: దొరకక ఏమి చేస్తడు ! యిటువంటోళ్ళు లక్షలు అయింౢ్రు. వీడు లెక్క !

అమీన్:- మంచిపని అయింది, మంచిపని అయింది.

రెం. పో:- మా ప్రాణాల తిన్నడు.

అమీన్:- ప్రాణాలతిన్నాడు ? ఏమిరా ! వాడి ప్రాణాల మనం తిందాము.

రెం. పో:- చేతికొచ్చేవరకు ఏమైతదనో భయం ఉండె. తుపాకి గురి చూపకపోతె పారిపోయెటోడె.

అమీన్:- యిటు పట్టుకరండి, ఏమి, పోలీసులంటే నీకు పరవాలేదుకదు?
(*నరసింహారెడ్డి మాట్లాడడు. గంభీరంగా నిలబడి ఉంటాడు.*)

అమీన్:- ఒక తన్నుతన్నరా ?

ఒ. పో:- దొరకంగనె విడిచినాను....వల్లంతా మెదిగింది బాగా....

రెం. పో:- ఆరోజు మామీద తిరగబడింది తప్పక వీడే.

అమీన్:- ఎవడురా ?

నరసింహారెడ్డి:- నాకు తెలియదు.

అమీన్:- నీవు తప్ప ఈ తాలూకాలో మరోడికి దమ్ములేదు. నీవో, నీ పార్టీలో వాడో....

నరసింహా:- నాకు తెలియదు.

అమీన్:- పోలీసువాళ్ళ గుండెల్లో నిదుర పోతావేమొకదా ! చెప్పరా ?

నరసింహా:- నేను అనలేదు.

అమీన్:- నీవు అనలేదు ? నీవు ఏమి చేయలేదు ? వీణ్ణికొట్టింది ఎవడు?

నరసింహా:- నాకదేమి తెలియదు.

అమీన్:- అరేయి....వీడి నాలుక గుంజరా....

ఒ. పో:- అరేయి....చెప్పు, పళ్లు పగులుతది.

అమీన్:- పోలీసులంటె గడ్డిపరక అయిపోయింది.

ఒ. పో:- ధర్మారం బావడిలో బీటుజవాన్ నిదురపోతె పదిమందిని తీసి కొనివచ్చి తన్నిపోతాడు ?

అమీన్:- నీవేనారా ?

నరసింహా:- నాకు తెలియని సంగతి నేనేమి చెప్పను ?

అమీన్:- నీకు తెలియదు ? మాటలతోని చెబుతావు ? అరె ! హమీద్ !

*(ఒకరో కానిస్టేబులు చేతికర్రతో మోకాళ్ళపైన గట్టిగా కొడతాడు)*

నరసిం:- అబ్బా....అబ్బా....

అమీన్:- అవ్వా ! యింకోటి తన్ను.

ఒ. పో:- అప్పటికన్నా బాగా అయింది....చెప్పు ? ఉత్తగపోదు యిది.... ఏమొ అనుకున్నావు !

*(ఇంకొకటి కొడతాడు)*

రెం. పో:- తన్నులతో చచ్చిపోతవు. చెప్పు.

నరసింహా:- నా కేమీ తెలియదు.

అమీన్:- అరేయ్! వీనికి అట్టాకాదు. యింకా కొట్టాలె.

ఒ. పో:- మా దెబ్బలకు భూతాలు ఝడుస్తయి. నీ కేందిరా? యిదిగో చూడు? నీవు ఎట్లా చెప్పవో....

*(గట్టిగా కొడతాడు)*

నరసింహా:- చంపండి....మీ యిష్టం.

రెం. పో:- చెప్పేదాకా విడవం. చచ్చిపోతవు.

నరసింహా:- చంపండి....నాకేమీ తెలియదు.

ఒ. పో:- ఏమి తెలియదు?

నరసింహా:- తెలియదు.

అమీన్:- తెలియదురా?

(బూటుకాలుతో కడుపుమీద తంతాడు)

నరసింహా:- (వెల్లకిలబడి) అబ్బా! అబ్బా! నొప్పి....

(బాధతో కళ్ళు మూస్తాడు)

ఒ. పో:- చెప్పు యిక! చచ్చిపోతవు!

అమీన్:- చస్తేచచ్చె! పోలీసువాళ్ళమీద తిరగబడి చచ్చిపోయిండని పంచ నామా చేస్తా!

(నరసింహారెడ్డి కడుపుమీద రెండు చేతులు పెట్టి బాధపడుతుంటాడు)

ఒ. పో:- అరె! లే! ప్రాణం పోలేదు.

రెం. పో:- మొండి రాక్షసులు. వీళ్ళు చావరు.

అమీన్:- కనపడగనె గోలివేయనుంటిరి.

ఒ. పో:- గుడిసెలో పండుకున్నడు. మా అడుగుల చప్పుడు విని తెలివి వచ్చిందేమొ తొందర పుట్టింది. ఎటు పోయిన లాభం లేదనుకొని ఒక ఎత్తు వేసిండు యిక. తలుపు తోయంగనె బయటపడుదామని మెల్లగ గొళ్ళెంతీసి తెలివిగా పోయి దర్వాజా మూలకు నతికిండు. నేను యిదంతా చూడక తలుపు తోసుకొని లోపలికి పోయినా. నా వెనక యలవోడు ఉన్నడు. ఇద్దరము లోపలికి రాంగనే యిక అయిపోయింది అనుకున్నడు. దబ్బున లేచి ఉరకపోయిండు. దర్వాజాలో అడుగుపెడుతున్న పట్వారిని చూడలేదు. వానికి పోయి గట్టిగా తాకిండు. పట్వారి అట్లనే పట్టుకున్నడు. యిక విడవలే. యిద్దరు బాగ కలియబడ్డరు. పట్వారిని కిందపడేసి బయటపడేటోడె. యింతలో నేను ఉరికి 'కదిలితే కాలుస్త' నని తుపాకి చూపెట్టినా. యిక అట్లనే చచ్చినోని తీరు భూమికి వంగిండు.

అమీన్:- ఉడాయించనుంటిరి.

ఒ. పో:- పట్వారి, వీడు కలెబడ్డరు. లేకుంటే అయ్యేదే.

అమీన్:- వీడు పోతే ఈ తాలూకా మొత్తం లొల్లి లేకుండ అయితది.

రెం. పో:- బాగా నేర్పిండు రైతులకు. కోడి యివ్వకు, గుడ్డు యివ్వకు, మూటలు మోయకు, ఎట్టి చేయకు, యిది పాఠం అయిపోయింది అందరికీ.,

(నరసింహారెడ్డి బాధపడుతుంటాడు)

ఒ. పో-- అరేయి! యింకేమైంది లే.

అమీన్:- తన్ను ఒకటి. సదుం చక్కగా అయితది....

రెం. పో:- రైతులంతా వీని పాట బాగా నేర్చింద్రు. మొన్న గణేశ పురంలో సాకలదాన్ని మూటకు రమ్మంటే 'పైసలు తే వస్త' నన్నది. మూతిపండ్లు విరగకొట్టినా.

రెం. పో:- రాంపురంలో ఏమి చేసిండు? వెంకటాపురం నుంచి కోళ్లు తెచ్చి చావట్లోపెట్టి ఊళ్ళోకి పోయినా. వచ్చేవరకు కోళ్ళన్నీ విడిచిపెట్టించిండు. వీడు తప్ప మరోడు కాదు.

ఒ. పో:- తాలూకా మొత్తం పాడుచేసిండు. మునుపు కానిస్టేబలు అంటే ఊరంత యట్ల భయపడేది! యిప్పుడు బాట పోయే ఆడదికూడ రాచుకపోతది.

అమీన్:- చంపేయండి వెధవను.

(నరసింహారెడ్డి గోడకు ఆనుకుని వొరిగి కడుపు పట్టుకొని బాధ పడుతుంటాడు)

ఒ. పో:- బాగ తగిలింది వెధవకు.

అమీన్:- బూటు దెబ్బ! ఝాడించి తన్నినా.

ఒ. పో:- అరేయ్! ప్రాణం పోదులే.

రెం. పో:- యిట్లా చెప్పడు వీడు. కళ్ళలో కారం పెట్టాలె.

అమీన్:- మంచి మందురా. పట్వారి యింటికిపో.

*(రెండో పోలీసు పోతాడు)*

ఒ. పో:- అరె చెప్పు. వళ్లంతా పగలగొట్టుకోకు.

అమీన్:- ఒక్క తన్నుతో యేమైంది? క్షణం నిలబడు నీవే చెపుతవు.

ఒ. పో:- వీని కొకనికి బుద్ధివస్తేగాని, పోలీసు అంటే....మళ్ళీ భయ భక్తులు యేర్పడవు.

అమీన్:- పోలీసు అంటే ఏమిలేదు. పిల్లలాట ఐపోయింది.

*(రెండో పోలీసు వస్తాడు)*

ఒ. పో:- హు....యిక కండ్లు తెరవురా.

*(నరసింహారెడ్డి తన బాధ తాను పడుతుంటాడు.)*

ఒ. పో:- నీవెక్కడ చస్తవు? కండ్లు తెరువు.

*(ఒకటో కానిస్టేబలు నరసింహారెడ్డి కళ్ళు బలవంతంగా తెరిపిస్తాడు. రెండో కానిస్టేబలు కళ్ళలో కారం కుక్కుతాడు.)*

నరసిం:- అబ్బా. కళ్లు ...పాయె.

అమీన్:- చావు....యిక చెప్పు. నీవు ఎవన్నెవణ్ణి కొట్టింది.

నరసింహా:- నాకేమి తెలియదు.

అమీన్:- లేకపోతె ఆ కొట్టిన వానిపేరు చెప్పు.

నరసింహా:- అబ్బా! ఎవరైంది నాకు తెలియనే తెలియదు.

అమీన్:- ఇక నీవే చెపుతవు.

నరసింహా:- అబ్బా! కళ్ళు భగ్గుమంటున్నాయి.

రెం. పో:- ఇంకా అంటయ్.

నరసింహా:- కళ్ళు కనబడటం లేదు.

ఒ. పో:- బాగ కనపడతయ్ యిక.

నరసింహా:- అయ్యో.... అయ్యో.... కళ్ళు మాడిపోతున్నయ్.

ఒ. పో:- మాడిపోనియ్. మసి కానియ్.

నరసింహా:- అయ్యో!.... అయ్యో!....

రెం. పో:- ఏడ్వు.

నరసింహా:- కండ్లు.... కండ్లు.

రెం. పో:- ఎక్కడికీ పోవు.

నరసింహా:— కడ్లు ....కండ్లు.... నిప్పులు పోసినట్టు మండుతున్నయ్.

రెం. పో:— ఏమనుకున్నవు?

నరసింహా:— అయ్యో.... మంట.... మంట.

ఒ. పో:— తెరువు.... మళ్ళీ ఒకసారి పెడతా.

నరసింహా:— అయ్యో.... అయ్యో....

*(అటు యిటు చూడటానికి ప్రయత్నిస్తాడు.)*

అమీన్:— ఇప్పుడైన చెప్పు. నీవు కాకపోతే యెవడో వాని పేరు.

నరసింహా:— ఎవడైంది నాకు తెలియదు.

అమీన్:— అరేయ్.... నిన్ను వదిలేస్తాము వానిపేరు చెప్పు.

నరసింహా:— అబ్బో! నాకెవడూ తెలియదు, నిప్పులు కురుస్తున్నయి.

ఒ. పో:— ఈ రాత్రి వీణ్ణి యిక్కణ్ణుంచి తీసుకుపోవలె.

అమీన్:— ఊ.... ఊ.... తెల్లవారితే లాభంలేదు.

రెం. పో:— నడిచేనా? వల్లంత మెదిగింది.

అమీన్:— తన్నండి....వీడు మనదగ్గర వద్దు.... ఘాతం! తెల్లవారక ముందే ఊరు దాటించాలె.

ఒ. పో:— అవును తెల్లవారకముందే ఊరు దాటించాలె.

రెం. పో:— రిమాండు చేయించాలె?

అమీన్:— నా పేరు చెప్పండి. ఒంటరి గంజ్‌లో వేయమనండి.

రెం. పో:— గోడనుంచి కదులుతలేదు. నడిపించేనా?

అమీన్:— గుంజుక పోండి, లాఠీవుందా?

ఒ. పో:— అరే! నడవు యిక.

*(రెండో పోలీసు చేతులకు సంకెళ్ళు వేస్తాడు.)*

అమీన్:— సరిగా పడ్డాయో లేవో జూసుకోండి!

ఒ. పో:— *(కప్పు చూస్తాడు)* ఇక ఎక్కడికిపోతాడు?

అమీన్:— ఇదిగో కాగితం.... భద్రం మరి.

ఒ. పో:— వాని నెక్కడ విడిచి పెడతాము. శవాన్ని అయినా గుంజుకు పోతాము.

అమీన్:— అంతే.

ఒ. పో:— నడువు.

*(నరసింహారెడ్డి నొప్పితో నీరసంగా నడుస్తాడు)*

## మూడో రంగం

*(నరసింహారెడ్డి చేతులకు కప్పులుంటాయి. బాధతో నీరసంగా నడుస్తు వుంటాడు. పోలీసులు నరసింహారెడ్డిపైన విసుగుకుంటూ వుంటారు.)*

ఒ. పో:— అరేయ్! యింకా ఆరుమైళ్ళు నడవాలె.

నరసింహా:— నా చేతనైనంత నడుస్తున్నా.

రెం. పో:— యిక్కడె రెండుజాములైంది. వీడు ఈ రోజు వుపాసం పండపెడుతడు.

ఒ. పో:— ఉపాసం, మనకేంది? రాంపురంలో మంచిగా పటేలును పిలిపించి....

రెం. పో:— ఏమన్నా ఉన్నాయ్ జేబులో?

ఒ. పో:— ఏమన్నా ఉంటే సరే, లేకపోతె ఈ రోజు నీకు ఏకాదశి.

నరసింహా:— నావొళ్లు తిరుగుతుంది. కొంచెం కూర్చుంటా.

రెం. పో:— తిండి అనేపరికు వీనికి చేతకాకుండా అయింది.

నరసింహా:— నా కేమీ కనపడటంలేదు. ప్రాణం చుట్టుకపోతుంది, నేను నడవలేను.

*(కూర్చొనిపోతాడు.)*

ఒ. పో:— అరే, నడువు.... చావట్లో పండుకుందువు పా.

రెం. పో:— అదేమిటి, ఊరు!

నరసింహా:— ఏమన్నా తినంది నాచేతకాదు నడవను.

*(నేలమీద చదికిలబడతాడు.)*

ఒ. పో:— అరె....పా.... ఊళ్లోకి ఇక్కడేమున్నది?

*(కదలడు)*

రెం. పో:— ఊరుదగ్గరకివచ్చి కూచుంటావా?

*(తలవంచుకొని అట్లాగే కూర్చుంటాడు.)*

ఒ. పో:— అడవిలో ఏమి దొరుకుతది? ఊళ్లోకిపోయినంక అడుగు. అప్పుడు....

*(ఘూర్ణాడడు)*

రెం. పో:— కోమటియింట్లో ఏమన్నతిందువు పా.

ఒ. పో:— లే....

(నరసింహారెడ్డి కణతలు పట్టుకొని బాధపడుతూ లేస్తాడు. అంతా ఒక వైపున లోపలికివెళ్ళి రెండోవైపున ప్రవేశిస్తారు. నర్సింహారెడ్డి గోడకు చేర గిలబడతాడు. పోలీసు ఎలవాణ్ణి కూతలువేస్తాడు. ఎలవాడు ఉరికి వస్తాడు. ఎలవాడు క్షణంలోపోయి పోలీసువాళ్ళు వండుకోడానికి బియ్యం, ఉప్పు, చింతపండు మిరపకాయలు, కాశినిపాలు తెస్తాడు. నర్సింహారెడ్డి పాలుతాగి కొంచెం తెప్పరిల్లుతాడు.)

ఒ. పో:— (రెండో పోలీసుతో) అన్నం తొందరగా కానీయ్. యిక్కణ్ణే చీకటి అయితది.

రెం. పో:— (నరసింహారెడ్డితో) అన్నం.... అన్నం.... అని చస్తాం టివి. ఈ ధనియాలు కొంచెం నూరు, అట్టనే అల్లం.... మిరప కాయలు.

నరసింహా:— మంచిది.

రెం. పో:— అరేయి.... మరచినా, ఎలోడూ! కోడి తీసక రారా!

ఎలవాడు:— అయ్యా.... దొరుకుతది.

ఒ. పో:— హత్.... ఉరుకు.

రెం. పో:— అల్లం బాగానూరు.

(నరసింహారెడ్డి నూరబోతాడు. కాని సంకెళ్ళు అడ్డం రావడంవలన నూరరాదు.)

నరసింహా:— వీలుకావటంలేదు.

ఒ. పో:— కప్పు తీసెయ్! యిప్పుడు పోతాడూ! అయిన శాస్తి చాలదూ!

(రెండోపోలీసు తీస్తాడు)

రెం. పో:- యిక నూరు. ఎట్లా ఉండాలె? మెత్తగా.

నరసింహా:- నూరుత.

(తలవంచుకొని నూరుతుంటాడు.)

రెం. పో:- వీడికి అన్నీ వచ్చు.

ఒ. పో:- రానిదే అడవులపొంటి తిరుగుతాడు!

రెం. పో:- అల్లం అయిందా?

నరసింహా:- అయిపోయింది.

ఒ. పో:- ఎల్లిపాయ.

నరసింహా:- అయింది.

రెం. పో:- మిరపకాయలు?

నరసింహా:- నూరుతున్నా.

ఒ. పో:- మెత్తగా పిండిమాదిరి....మాంసం కూర మరి!

నరసింహా:- నూరుతా....

(నరసింహారెడ్డి కళ్లలో నూరుతున్న పొడుం పడుతుంది, ఆ మంటిలో ఏదో ఆలోచన స్ఫురిస్తుంది. ఆలోచిస్తూ కళ్ళు నలుచుకుంటాడు.)

ఒ. పో:- మళ్ళీపడ్డది కారం?

నరసింహా:- పరవాలేదు - పోయింది.

ఒ. పో:- మెత్తగా నూరు-తొందరపడకు.

నరసింహా:- మెత్తగానే నూరుత.

రెం. పో:- నాకు చూపాలె.

నరసింహా:- చూపుత.

రెం. పో:- ఎలవాడు రాలేదు చూడు.

ఒ. పో:- కోడిదొరకవద్దూ.

రెం. పో:- అరె! మళ్ళీ యిటువంటి తిండి దొరకదు. (మొదటి పోలీసుతో) నువుపోయి ఎలవాడిని తీస్కరాపో.

ఒ. పో:- జైల్లో పడ్డంక యింకనా?

రెం. పో:- జైల్లో జొన్నరొట్టె, చింతపులుసు.

నరసింహా:- కారం అయింది తీయనా!

రెం. పో:- యిటుచూపు, ఎట్లా నూరినవో.

*(నరసింహారెడ్డి ఉత్సాహంగా రెండు దోసిళ్ళ కారం వాళ్ళ మధ్యకు తీసుకుపోతాడు. రెండో పోలీసు వేలుపెట్టి దానిని పరీక్షిస్తుంటాడు. నరసింహారెడ్డి అకస్మాత్తుగా ఆ కారాన్ని అతని కళ్ళలో గుప్పి ఒక్క గంతులో బయట పడతాడు.)*

రెం. పో:- అబ్బా! ఉరికె, ఉరికె, అబ్బా! కళ్లు పాయె....ఎట్లా ?

*(కళ్ళు నలుముకుంటూ లేచి బాధపడుతుంటాడు.)*

రెం. పో:- యిక దొరకడు....మంట....మంట.

*(భయపడుతూ ఎలవాడు మొదటి పోలీసుతో ప్రవేశిస్తాడు.)*

ఎల:- అయ్యా! కోడి దొరకలే, గుడ్లు తెచ్చినా.

రెం. పో:- నెత్తిన కొట్టుకో. గుడ్లు మండిపోయె.

ఎల:- అయ్యా! అదేంది? ఏమాయె?

రెం. పో:- అరె! ఉరుకు, ఉరుకు. వాడు పోయె.

ఎల:- ఎవరయ్యా?

ఒ. పో:- ఎవరయ్య! అరె! వాడు! పట్టుకో పో.

ఎల:- అయ్యో! ఏమాయె? ఎటుపాయె?

ఒ. పో:- ఉరుకురా.

ఎల:- ఎటు?

ఒ. పో:- ఉరుకురా! అబ్బా! కళ్ళు చితికిపోతున్నయ్.

రెం. పో:- కండ్లల్లో కారం పెట్టిండా?

ఎల:- అయ్యో! కారం అంతా చల్లిండు.

ఒ. పో:- అరె! ఉరుకుతావా? లేదా?

ఎల:- ఎటు ఉరుకా?

ఒ. పో:- బాట పొంటె ఉరుకు. మంట అబ్బా!

ఎల:- ఎంత దూరం పోయెనో? అయ్యా! పోతున్నా....యిపుగో గుడ్లు.

ఒ. పో:- ఆడ పారేయ్! గుడ్లు! అరె! మంట! మంట!

రెం. పో:- నా తల తిరుగుతుంది. అబ్బా!

ఒ. పో:- కారం బాగ మండుతది!

రెం. పో:- అవును. మండదుమరి. వాడు దొరుకుతడా?

ఒ. పో:- అబ్బా!

రెం. పో:- హా! వాని తెలివి చూడు.

ఒ. పో:- తెలివా? తెలివా? చెప్పె తెలివి కాదు.

రెం. పో:- అందుకే సర్కారుకు——

ఒ. పో:- భయం——భయం——వీళ్ళంటేనే భయం. కారం ఇంత మంట ఉంటదని- హూ! నేనూ అనుకోలె,

రెం. పో:- యిక దొరకడు వాడు.

ఒ. పో:- మనకి డబుల్ గంజ్ ఖాయం.

రెం. పో:- మంట! మంట!

(ఇద్దరు తలలు పట్టుకొని కూర్చుని ఉంటారు.)

[తెర]

